# సనాతన ధర్మోపన్యాసము.






గ్రంథకర్త

(బ్ర. వే. మల్లాది రామకృష్ణశాస్త్రి)

సోమయాజులవారు.



మంజరీ ప్రెస్, బెజవాడ.

 వెల 0-0-6.

ఓమ్.

శ్రీ గురుభ్యోనమః

# సనాతనధర్మోపన్యాసము.



ఆర్యమహాశయులారా!

మహనీయులును, బహువిధ వి
ద్యాపరిశ్రమశాలురును, లోకో
పకార బద్ధాదరులును, నగు మన
యాంధ్రుల యుద్యమములు కడు
శ్లాఘనీయములు. అయినను మన
ము చేయఁదలఁచిన పనులవలనభ
రతఖండమునకు మూలధనమని చె

ప్పఁదగిన సనాతనధర్మమున కెట్టి లాభము గలుగనున్నదో మనము విచారించుకొనవలసియున్నది. ఆంధ్రదేశమున సర్వకళాశాలలు కావలయుననుటయు, నాంధ్రులకుగొప్పయుద్యోగములిచ్చి వృద్ధికిఁదేవలయుననుటయు, నింక రాజనీతితో సంబంధించిన, వర్ణాశ్రమధర్మ విరుద్ధములుగాని యితరాభివృద్ధుల ను గోరుటయు, సర్వసమ్మతములే. ఇంక సంఘసంస్కరణ మనుపేరిటమనవారలు చేయఁదలఁచిన మార్పులుమాత్రము శ్రుతి స్మృతి వి

రుద్ధములుగను, సదాచార ప్రతికూలములుగను, నాయురారోగ్యైశ్వర్యాది నాశకములుగను నున్నవి. అవి యేవన-౧వర్ణసంకరము (సర్వవర్ణములు కలసిభుజించుట, కలసి సంబంధములు చేసికొనుట) ౨. వితంతు వివాహములు. ౩. రజస్వలానంతరవివాహములు. ౪. దూరసాగరయాత్ర. మొదలగునవి

* ౧. వర్ణ సంకరము. *

"సంకరో నరకాయైవ కులఘ్నానాంకులస్యచ" అని భగవద్గీతయందు, వర్ణసంకరము నరక హేతువని

యర్జునుఁడు పలుకఁగా, శ్రీకృష్ణ మూర్తి యంగీకరించిరి. "హీనజాతిస్త్రియంమోహా దుద్వహంతో ద్విజాతయః, కులాన్యేవనయంత్యాశు, ససంతానాని శూద్రతాం" హీనజాతిస్త్రీని నుత్తమజాతిపురుషులు వివాహమాడిరేని వారి వంశములు హీనజాతిలోఁ జేరునని, మనుస్మృతి చెప్పుచున్నది.

"సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయేతద్దర్శనాత్" అను వ్యాస సూత్రము, ప్రాణావసానకాలము ప్రాప్తించినప్పుడు, హీనజాతులయ

న్నమునైన భుజించి ప్రాణములు నిలుపుకొని యనంతరము తగుప్రా యశ్చిత్తములఁ జెందవలయునని సె ప్పుచున్నది. ఇప్పుడట్టి యాపద మన కేమియుఁ బ్రాప్తించలేదు. "ఆ లస్యా దన్నదోషాచ్చ మృత్యుర్వి ప్రాన్ జిఘాంసతి" యను మను వచనము, దురన్నభక్షణ మకాల మరణమునకు హేతువని తెల్పుచు న్నది. "అనిందితైస్త్రీవివాహైర నింద్యా భవతి ప్రజాః నిందితైర్నిం దితా నౄణాం। తస్మాన్నింద్యాన్వి వర్జయేత్" అని మనుస్మృతి శా

ప్రనిషిద్ధములైన వివాహములవల నసంతానమంతయు నిందితమగునని సెప్పుచున్నది. "రాజాన్నం తేజ ఆదత్తేశూద్రాన్నంబ్రహ్మవర్చసం' ఇత్యాది నిషేధములున్నందున స ర్వాన్నభక్షణము కూడనిపని యు నక తీరదు.

"కువివాహైః క్రియాలోపై ర్వే దా నధ్యయనేనచ కులాన్యకుల తాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ" అను మనువచనము హీనజా తివివాహములవలనను, యజ్ఞాదిక్రి యాలోపములవలనను, వేదముల

నధ్యయనము చేయకపోవుటవలన
ను బ్రాహ్మణులయాజ్ఞోల్లంఘనము
వలనను, వంశములు భ్రష్టము
లగు చున్నవని చెప్పు చున్నది.
"శూద్రై ర్నానావిధై ర్వర్ణై
శ్చండాలాదిభి రీక్షితం పుష్పవత్యా
సూతికయాదృష్టంవా పతితాదిభిః
అన్నం భక్ష్యం తథాశాకం భుక్త్వా
విప్ర స్సకృద్యది ప్రాయశ్చిత్తీ భ
వేచ్చాపి నకర్హాగ్రోథ వేదిహా" శూ
ద్రులు చండాలురు, రజస్వల, ప్ర
సూతియైనస్త్రీ, పాపాత్ములు మొ
దలగువారిచేఁ జూడఁబడిన యన్న

ముగాని, భక్ష్యము శాకము మొదలగు వానినిగాని యొకప్పుడు భుజించినను, ప్రాయశ్చిత్తము చేసికొననిది, స్వధర్మానుష్ఠానమున కర్హుఁడు గాఁడని దేవల స్మృతి చెప్పుచున్నది. ఇట్టులుండఁగా "సోషలు గాదరింగు" లను పేరఁట సమావేశమయి మనము చేయుచున్న యభక్ష్య భక్షణము లెంతజాతిభ్రంశకరములో మన మాలోచించుకొని నివర్తించుట మంచిపని. తురుష్కులెట్టి సమయమం దైనను వారి శాస్త్రమందు నిషేధింపఁబడి

న పందిమాంసమును భుజింపరు. పందిని స్పృశింపరు. అనాదికాలసి ద్ధమై శ్రుతి స్మృతి ప్రసిద్ధమగు మత మందు జన్మించిన మనమాహారని యమముల నిర్మూలము చేయుటకొ అమాలినపనిగాని వేఱుగాదు. మ హర్షులు వస్తుశక్తులను మార్పగలి గిన తపోబలము గలవారు గనుక వారి చరితములయందు, హీనజాతి స్త్రీ స్వీకారము, సితరాన్న భక్షణ ము, నెచ్చటనైనగనుపించినను, న ట్టి తపోబలము లేని మనము వారి వచనముల ననుసరించి నడువవల

యునేగాని, వారిచరితముల నను
సరింపవలనుపడదు. గనుకనే" ఋ
షీణాం వచనం సత్యంతథైవాచరితం
క్వచిత్" అనియు "తేజీయసాంన
దోషాయ, వహ్నే స్సర్వభుజోయ
థా" అనియు, నట్టికృత్యములు, త
పోబలముగలవారలను బాధింపవ
నియు, మనలను బాధించుననియు
భాగవత వచనములు బోధించు
చున్నవి.

౨. వి త ం తు వి వా హ ము లు.

"సకృత్కన్యా ప్రదీయతే" "త్రీ
ణ్యేతానిసతాంసకృత్" ఇత్యాది

వచనములనుఁబట్టి వితంతువివాహ
ములు సత్పురుషు లాచరింపఁదగి
నవికావు. వర్ణసంకరద్వారా న
రకహేతువులు. "నవివాహవిధా
వుక్తం విధవా వేదనంపునః అయం
ద్విజైర్హివిద్వద్భిః పశుధర్మోవిగర్హితః
మనుష్యాణా మప్యుక్తో వేనేరా
జ్యం ప్రశాసతి" మనుస్మృతి విధవ
కు వివాహము వేదమందెక్కడనుఁ
జెప్పఁబడలేదనియు, వర్ణసంకరకా
రకుఁడునుఁ బాపాత్ముఁడును నగు వే
నుఁడు,బొట్టుపెట్టుకొనుట సంతా
నార్థమునియోగించుట, మొదలగు

ననాచారములను బ్రవర్తింపఁ జేసెను ఇట్టిదానిని సాధువ్రులు నిందించు చున్నారు అని చెప్పుచున్నది. గ నుక విధవావివాహ మెప్పుడును శాస్త్రీయము కానేరదు. కలియు గంబునఁ బ్రత్యేకముగ నిషేధింపఁ బడినది. గనుక బ్రాహ్మణగాఁబనికిరా దు. అట్టివివాహములు చేసికొను వారలు వేఱయొక తెగగానుండిన నుండవచ్చును; గాని వారలకు, వే దమతానుసారులగు నితరులకును నెట్టిసంబంధములును నుండగిట్టదు. ఇట్టులుండ వితంతు వివాహవాదు

లు "నష్టేమృతే ప్రవ్రజితేక్లీబే చ
పతితేపతౌ పంచస్వాపత్సు నారీ
ణాం పతిరన్యో విధీయతే" అని ప
రాశర స్మృతియందును, "ఉదీర్ష్వ
నారీ" యనుమాత్రమునందును భ
ర్త నశించినప్పుడిఁకొకని వివాహ
మాడవచ్చునని సెప్పఁబడియున్న
దని, వాదించుదురు. నష్టేమృతే
యనుశ్లోకము, వివాహయోగ్యుఁ
డైన యన్నయుండఁగాఁ దమ్ముఁడు
వివాహమాడెనేని, యట్టివివాహ
ము శాస్త్రీయమై, వివాహసిద్ధికా
లేదుగాన నాభర్త నష్టమైనప్పుడా

స్త్రీ తిరిగి వివాహ మాడవచ్చున నియెడు నర్థమిచ్చునని పూర్వో త్తర ప్రకరణములనుబట్టియువ్యా ఖ్యానమునుబట్టియు దేలుచున్న ది; గాని విధవావివాహపరము మాత్రము కాదు. "ఉదీర్ష్వనారీ" యను శ్రుతిపితృమేధములోనిది. వి వాహవిధాయకముగాదు. దుఃఖో పశమనార్థము చెప్పినయర్థవాదము గాని సత్యముగు నర్థమును జెప్పు నదిగాదు. ప్రకృతము ననుసరించి, వేద మర్థవాదములచే ప్రోత్సాహ ముచేయుట "సారోదీల్" ఇ

త్యాది శ్రుతుల గురుతెఱిఁగినవారి
కొక వింతగాదు.

3.రజస్వలానంతర వివాహములు.

మాతా చైవ పితా చైవ జ్యేష్ఠ
భ్రాతా తథైవచ త్రయ స్తే నరకం
యాంతిదృష్ట్వా కన్యాం రజస్వలాం
వివాహమునకుఁబూర్వముకన్యరజ
స్వలాయైనేని దానితల్లియుఁ, దండ్రి
యు జ్యేష్ఠభ్రాతయు, నరకమును
బొందుదురు. యస్తాం సముద్వహే
త్కన్యాంబ్రాహ్మణో మదమోహితః
అసంభాష్యో హ్యపాం క్తేయస్సవి
ప్రోవృషలీపతిః యః కరోత్యేకరా

త్రేణవృషలీసేవనం ద్విజః సభైక్ష
భుగ్జపన్నిత్యం త్రిభిర్వర్షై ర్వ్యపో
హ్యతి” ఈ రజస్వలయయిన కన్య
ను వివాహమాడినవాఁడు పంక్తి
కర్హుఁడుగాఁడు. అనఁగాఁ గులభ్రష్టుఁ
డు. ఒకదినమాత్రస్త్రీతోఁ సహవా
సము చేసినేని మూఁడువత్సరము
లుభిక్షాహారము చేయుచు, మంత్ర
జపముఁ జేసిన శుద్ధుఁడగును అని
యనేకవచనములు సెప్పుచున్నవి.
గాన రజస్వలానంతరవివాహము
లు కేవల పాపకృత్యములు. రజ
స్వలానంతర వివాహవాదులు,

త్రీశివర్షాణ్యు దీక్షేత కుమార్యృతుమతీ సతీ ఊర్ధ్వంతు కాలా దేతస్మాద్వింధేత సదృశం పతిమ్" కన్యక ఋతుమతి యయినతరువాత మూఁడువత్సరములదనుక తండ్రి యెవరికైన నిచ్చునేమోయని నిరీక్షింపవలయు. అనంతరము తనంతనే భర్తను వరింపవలయు. అని మనుస్మృతివచనములు గలవని వాదించెదరు.

అన్ని వర్ణములవారికిని, రజోదర్శనమునకుఁ బూర్వమందే వివాహము న్యాయ్యము, క్షత్రియుల

కుగాంధర్వవివాహముఁ గూడఁగల
దు గనుక రజస్వలయయినతరువాత
మూఁడుసంవత్సరములు నిరీక్షింప
వలయుననుట క్షత్రియవిషయము.
"సవిప్రోవృషలీపతిః" "వృషలీసే
వనం ద్విజః" ఇత్యాదివచనములు
బ్రాహ్మణులకు రజస్వలానంతరవి
వాహములు కూడవని ప్రతిపాదిం
చు చున్నవి. వైశ్యులకు గాంధ
ర్వవివాహము లేదుగనుక, బ్రా
హ్మణులకుఁబోలె, రజస్వలాపూ
ర్వవివాహములే శాస్త్రీయముల
గుటంజేసి, మహనీయులగు శిష్టుల

యాచారములును నిటులనే గన్ప
ట్టుచున్నవి.

## 4. దూ ర సా గ ర యా త్ర.

"తస్మాన్న జనమియా న్నాంత
మియాత్" "ద్విజ స్యాబ్ధౌతు నా
యాతు శ్శోధితస్యాపి సంగ్రహః"
అని యున్నందున, ద్వీపాంతరముల
కు సముద్ర మార్గమున బుద్ధిపూ
ర్వకముగఁ బోయి వర్ణేతరాన్న
మును వారితోఁగలసి భుజించుచు
నానావిధములయిన, సనాతనధర్మ
విరుద్ధములయిన, కృత్యముల నా
చరించువారలు, ప్రాయశ్చిత్తము

లాచరించినను దమతమ జాతుల
లోఁ జేయుటకు శాస్త్రప్రకారము
వీలు లేదు. ద్వీపాంతరగమనము చే
యనిచో నాయా దేశవిద్యలు మన
వారలకు లభింపవందు లేని మన
దేశమందు బుద్ధిశాలులైన నాలవ
జాతివారు గ్రహించివచ్చి యితరు
లకు బోధింపవచ్చును. బ్రాహ్మణు
లే పోవలయునంటే తాము దే
శోపకారము చేయఁ దలంచినవా
రు గనుక సనాతనధర్మమున కుప
చరించుట మహోపకారము కాఁ
బట్టి తాము వెళ్ళి విద్యలనేర్చి వచ్చి

వేఱుగానుండి, వర్ణ సంకరము చే యకయు దేశోపకారము చేయువచ్చును. గాని యాశకు మేర లేక, కేవల ద్రవ్యార్జనమున కైన విద్యల కొఱకు సనాతన ధర్మపద్ధతులమీఱి ద్వీపాంతరగమనము చేసి వర్ణ సంకరకారకులగుట కడు శోచనీయము. యుగాంతరములయం దెవ్వరయినఁ బోయినఁ బోయియుండవచ్చును. వారు పాపభీతిగలవారు గానఁ దగు ప్రాయశ్చిత్తములు చేసికొని, వర్ణములలోఁ గలసియుండవచ్చును. కలియుగమందు

విశేషనిషేధము లున్నందున, నిప్పుడు సంఘములోఁ జేర్చుకొనుటకు, శాస్త్రప్రకారము వీలులేదు. ఉచ్ఛృంఖలముగా వర్తింపఁదలఁచినవారికి నెవరియాజ్ఞలతోడను బనిలేదు.

"ధర్మమే జయప్రదము."

"శ్రుతింపశ్యంతిమునయః పఠంతిచ తథాస్మృతిం తస్మాత్ప్రమాణ ము భయంప్రమాణైః ప్రమితంభువి యోనమన్యేత తేషూభేహేతు శాస్త్రాశ్రయాన్నరః స సాధుభిర్బహిష్కార్యో నాస్తికో వేద

నిందకః" శ్రుతిస్మృతులు ప్రమా
ణములు. వానిం దిరస్కరించి వర్తిం
చెడివారు నాస్తికులు. సాధువులు
వారిని జేరంగూడదని మనుస్మృ
తి చెప్పుచున్నది. "తస్మాచ్ఛాస్త్రం
ప్రమాణంతేకార్యాకార్య వ్యవస్థి
తౌ జ్ఞాత్వాశాస్త్ర విధానోక్తం క
ర్మకర్తుమిహార్హసి" అనుభగవద్గీతా
వాక్యమీ పని చేయందగును ఇది
చేయ గూడదు అని తెలియుటకు
శాస్త్రమే యాధారము. మనమ
నంబులకుం దోచినట్లు లెల్లం జేయం
గూడదు అని తెల్పుచున్నది గాన

మనము సనాతనధర్మములను మాఱ్పఁగూడదు.

గనుకనే "స్త్రీభ్యో వృద్ధాభ్యః" అని ధర్మసంశయము కలిగినప్పుడు వృద్ధస్త్రీలవలన ధర్మమును దెలిసికొనవలయునని యాప స్తంబమహర్షి నుడివెను. ఇప్పుడు స్త్రీలకు నవనాగరికవాసనానుసారియు సదాచార పరిపంథియునగు విద్యగఱపుట మహిళాసభల నేర్పఱచి వీరిని దేశములవెంటఁ ద్రిప్పుటయు మొదలగు నూతనపద్ధతులు సనాతనధర్మముల నిర్మూలము చేయుటకు ము

ఖ్యసాధనములు. గాన గృహకృ
త్యనిర్వహణమునకుఁ దగినంతవిద్య
ను దమయిండ్లలోఁ జాము తమపి
ల్లలకుఁ జెప్పుకొని సభలకుఁబంపు
ట, పత్రికలు చదివించుట, మొదల
గు పనుల మాని వేయించి పతిభ
క్తి, దైవభక్తినిబోధింపఁజేసిన సనా
తనధర్మమునకుఁ గొంత లాభము
కలుగును. తురుష్కులు జనానా
కలిగి వర్తించినందున వారిశౌర్య
మున కేమి నష్టము కలిగినది? చిర
కాలము రాజ్యమేలలేదా? పూ
ర్వకాలపు మహారాష్ట్రస్త్రీలు వి

ద్యాధికులు కాకపోయినను వారి
పాతివ్రత్యమునకుఁగాని, భర్తలక్షే
మ లాభములకుఁగాని, లోపము
కలిగెనా? మనదేశపుఁ బూర్వకా
లపుఁ స్త్రీలు మీటింగులు చేయ
కపోయినను వారి సంతానము వి
ద్యావంతము కాలేదా? గనుక స్త్రీ
విద్యయొక సాధకముగాఁ గనుపిం
పదు. మఱియు, విద్య హెచ్చిన స్వా
తంత్ర్యము హెచ్చును. స్త్రీస్వాతం
త్ర్యము ధర్మశాస్త్రవిరుద్ధము: "పా
నం దుర్జన సంసర్గః పత్యాచ విర
హోటనం స్వప్నోన్యగేహవాస

శ్చ నారీణాం దూషణాని షట్"
అని మనుస్మృతి బోధించుచున్నది.
వీరు పన్యాసములకొఱకు భర్తల
విడనాడి దేశాటనముఁ జేయుచు,
నితర గృహములలో నివసించుట
యంతగా మంచిదిగాదు. అనుభవ
మునుఁబట్టి చూడఁగా, నీరికిఁజదు
వుహెచ్చిన కొలఁదిని, శాస్త్రసిద్ధ
ములగు, హారిద్రాకుంకుమ ధార
ణాదులలోను, వస్త్రధారణ పద్ధ
తులలోను మార్పులుకలుగుచున్న
వి. కొలఁదికాలములోఁ శాకభో
జనాదులయందును, బురుషానువ

ర్తనము నందును, నీవైదుష్యము
మార్పునుఁ బొందించుననిఁ తోచు
చున్నది. మనభరతఖండమువారు
మతధర్మములయం దెక్కువ శ్రద్ధ
గలవారు. వీరికిఁబరలోక ప్రధాను
లనియెడి సర్వసంప్రతిపన్న మైన
ఘనత గలదు. అట్టి ఘనతను బుద్ధి
దౌర్బల్యము చేత, మనము ధ్వంస
ము చేసికొనుట, మంచిపని గాదు.
గాన మనమిట్టిమార్పులు కలుగ జేఁ
సికొనక, వేదశాస్త్రాభివృద్ధికై పా
టుబడుచు, విద్యార్థుల ప్రోత్సాహ
పఱచుచు విద్వాంసుల గౌరవిం

చుచు, యథాశక్తి సనాతన ధర్మ
ములనాచరించుచుండ వలయును
జ్ఞానాధికులగు లోకాచార్యులీ
భరత ఖండమునందే యవతరించిరి.
శ్రీశంకర రామానుజ మధ్వాచా
ర్యులిక్కడివారే గద. బౌద్ధజైన
తంత్ర ప్రవర్తకులు నిక్కడివార
లే. క్రీస్తు మహమ్మదు మొదలగు
వారలు భరతఖండ ప్రాంతవర్తులే
వేయేల, మనభరతఖండమునందం
త ఘనపండితులలో లెక్కింపఁబ
డని స్వామి వివేకానందులవారి
యుపదేశములచేత నమెరికా దేశ

వారు లెందరో శిష్యులైతరించిరి.
ఇట్టిమహనీయుల జన్మభూమియగు
భరతఖండమందు జన్మించి యెన్ని
ప్రభుత్వములు మారినను, నెన్ని
యిడుములఁ బడవలసి వచ్చినను,
పరలోక సాధనమగుటవలన మూ
లధనమనియెంచి, మన పూర్వులచే
జక్కఁగఁ బరిపాలింపఁ బడుచువ
చ్చిన సనాతనధర్మములను నిర్మూ
లించి, మనము ఉదరపూరణ ప్ర
ధానులమై, ధనార్జనార్థము పరవి
ద్యల నభ్యసించి, తత్సహవాసము
చేఁ దద్వాసనాదూషిత చిత్తులమై

జాతివిభాగమునే గురుతెలుంగని, వారలాచరించునట్టియు మనభర త ఖండములో హీనజాతుల వా రాచరించునట్టియు, సర్వాన్న భ క్షణము, వితంతు వివాహములు, రజ స్వలా నంతర వివాహములు సాగర యాత్రాదులు, మొదలగు ధర్మవిరుద్ధ కార్యములను జేయఁ బూనుట, చేయువారికిఁ బ్రోత్సా హముచేయుటయుఁ, గడుశోచనీ యము, అశాస్త్రీయము, అధర్మ ము అనర్థ దాయకము. ఆంగ్లేయు లు ప్రకృతమందత్యున్నత వైభవ

ముగలిగి నానాదేశముల యందుఁ
బ్రాభవముగలిగివర్తించుచున్నను,
దమకుఁ జిరకాలమునుండి వచ్చు
చున్న మతమునుగాని, వస్త్రధా
రణపద్ధతులనుగాఁ, స్త్రీలకుఁగల
నియమములనుగాని, యెంతమా
త్రము మాన్చుకొని యుండలేదు.
తురుష్కులును, దమనియమముల
ననుసరించియే యున్నా రనుట
లోకవిదితంబుగదా!

మనము మనమత ధర్మముల
గంధమునే యెఱుఁగక యిచ్చవచ్చి
నట్లు పూర్వాచార విరుద్ధముగా,

చదువరులారా!

ఈగ్రంథమందలి సదాచారగ్రంథ మాలను గూర్చిన ప్రకటనను జక్క గింపుఁడు. దానికిఁ జందాదారు లగుఁడు. తమ మిత్రులను గూడఁ జేర్పుఁడు. సదాచారముల నెల్లెడల వెలయింపుఁడు. పరమేశ్వరుఁడు మి మ్మాశీర్వదింపఁగలఁడు.

శంకరప్రసాదసంఘము, బెజవాడ.

